# పూలదోసిళ్ళు

[గేయాలు]


రచన:

కన్నెకంటి రామమల్లాచార్ M.A.

తెలుగు లెక్చరర్

S. V. K. P. College

మార్కాపురం.





మాతృశ్రీ రాజరాజేశ్వరీ పబ్లికేషన్స్

మార్కాపురం.

ప్రకాశం జిల్లా

తొలిముద్రణ
1983 ఆగస్టు





ముఖ చిత్రం
అమర్ & సీను

## మంత్రాలయం సేవించండి



పూజ్యాయ రాఘవేంద్రాయా సత్యధర్మ రతాయచా।
భజాతాం కల్పవృక్షాయా నమతాం కామధేనువే॥

వెల 5-00

# పూలదోసిళ్లు

## 1

ఓ జనని పార్వతి
చేకొనుము హారతి
నడచిరా నీయందె
ఘల్లుమనగా తల్లి
కురుల నీ పాపిటలో
కుంకుమ చెలువార
నీనొసటిపై తిలకం
కళకళ లాడంగ
అరుణాధరముపైన
చిరునవ్వులు వెలుగ
నీనోట తాంబూల
రాగాలు మెలగ
ముద్దమందారపూలు
సిగలోన విరియ
గళమందు పగడాల
హారాలు మురియ
రాగాంబరాలు నీ
మేనిపై నిలువ
ఎర్రనౌ గాజుల్లు
హస్తాల పెనవేయ
అమ్మ నీచేతులను
పదపద్మమ్ముల జేరి
గోరింటాకు రసము
అనురాగమ్మొందగ

## 2

విశ్వమాతా నమో ః నమోః
మాతా శ్రీ రాజేశ్వరి నమోః నమోః
నిజం నిజం ఇదే నిజం
నీసేవలకే కదా జగం

అందరు నీ సుతులే—ప్రజ
లందరు నీసుతులే
ఎక్కుతక్కువల లెక్కలేదులే
నీ సన్నిధిలో భ్రమరమ్మా ః మా యమ్మా ః

పార్వతి నీవేలే — జగ
దీశ్వరి నీవేలే
కనకదుర్గవే అన్నపూర్ణవే
అన్నీ నీవే లేవమ్మాః మా యమ్మా ః

మతముల సతమతము – స
మ్మతపరపుము శ్రీ గౌరీ
కులంఏదని జాతిఏదని
వివరణ సేయవె భవురాణి కల్యాణి

—०—

## 3

మాయమ్మ! దీవెనలిమ్మా!
మాయమ్మ! బంగరుబొమ్మ!
మాఎదలో ప్రేమలురేపు
నీ మెదిలే చల్లనిచూపు

నీ చల్లని సన్నిధిలోన
నీ చూపుల వెన్నెలలోన
మా బ్రతుకుల భాగ్యంపండే
మా గుండెల ప్రేమలునిండే

నీ పలుకుల చినుకులురాల
మా మనసుల తేనెలురాల
చిగురించును మానవ జీవం
వికసించును భక్తులభావం

ఈ మతాల నేకం జేయగ
సమ్మతాల పండించంగ
వెలసిన మాతల్లివి నీవే
తెలుసునులే శైలకుమారీ!

—o—

4

చిన్న పిల్లలంటే తన
కెందుకిష్టము ? అమ్మకు
పసిపాపలంటె
ఎందుకిష్టము ?

మాయెరుగని మనసనీ
ఈసెరుగని వయసనీ
పసిపాపల నవ పువ్వుల
చేరును అమ్మ ! కోరును అమ్మ !

దేవుని చిరునవ్వనీ
పూజకు అది పువ్వనీ
పసిపిల్లల మురిపెమ్ములను
చేరును అమ్మ ! కోరును అమ్మ !

కల్లెరుగని వారనీ
చల్లగ నవుతారనీ
పసి మనసుల కుసుమమ్ముల
కోరును అమ్మ ! చేరును అమ్మ !

—o—

5

నమస్సిదే : మనస్సిదే
మనస్సులో సుమ సదస్సులోన
నిండియున్న దేవి
వందనమిదె గొనుమా: నా
వందనమిదె గొనుమా :

శుభమ్ముగు శ్రీగిరియందున వెలసినదేవీ :
జయమ్మీయ, సాగి రయమ్మున దర్శనమీవా :
వేచివేచి మా కన్నులువాచే
భక్త్యావేశము ఆరకముందే

ధరాధర తనయ శుభంకరి శాంకరి రావే
గుణాన్విత హేమలతా గిరిరాజసుతా వరమీవే:
వేచివేచి మాకన్నులు వాచే
భక్త్యావేశము ఆరకముందే

సులోచన కింకర పాపవిమోచన రయమునరావే
కోరి కుమారి బిరాన వరమ్మీయ రావే
వేచివేచి మా కన్నులు వాచే
భక్త్యావేశము ఆరకముందే

—o—

స్వాగతమిదియే
సాగి రమ్మా !
మ్రోగెనిదే
జగాల వీణ

సువాసిని శ్రీ కుసుమవల్లి
సువాసన లో సుమాలల్లి
గళమున వేసెదము
పరగున బ్రోవగదే
నగరాజ కుమారి

పతులమేటి సుగుణపేటి
జనని కాళి సుజనమౌళి
చలమిక చాలింపవా
మనవిక ఆలింపవా ?
కుమారి శ్రీ మీరి

సుగుణశ్రేణి శివుని రాణి
సుజన తిలక పసిడి మొలక
తడయక లాలింపవా ?
విడువక దీవింపవా ?
నగరాజ కుమారి !

—o—

# 7

విశ్వమాత ఇదె వందనం
మాతృదేవి ఇదె వందనం
వందనమిదె గొను దేవత
అందింతుములే ప్రేమతో

సర్వమంగళ: నయనాంబుజ కళ
మేనకాసుత : లలిత :
భవ్య యోగిని : దివ్య కామిని
వందనమిదిగో గైకొనుమా మా
వందనమిదిగో గైకొనుమా :

హేమదుర్గ : స్వర్గాపవర్గ : ఉమ
లలితకంఠ నుత వైకుంఠ
హిమగిరి సదనా : సుందరవదన :
వందనమిదిగో గైకొనుమా మా
వందన మిదిగో గైకొనుమా

శైలబాల అపరంజిహేల
గిరిరాజసుత, మాతా
శక్తి రూపిణి ముక్తిదాయిని
వందనమిదిగో గైకొనుమా మా
వందనమిదిగో గైకొనుమా,

—o—

8

జగదీశ్వరి — జగదీశ్వరి
నీదే జగమంతా
కామాక్షీదేవి మీ
బిడ్డల మేమంతా

ప్రేమంటే నీవేలే నీవేలే
మమతంటే నీదేలే నీదేలే
నీ ప్రేమలు నీ మమతలు
మావేలే మావేలే

ముక్తికోరి వచ్చినాము నీకోసం
భక్తితోడ పలికినాము నీ నామం
మా కాయం మా జీవం
నీకోసం నీకోసం

అమ్మంటే కమ్మనైన ఒకభావం
ఆభావం కలిగించెను నవజీవం
మా భావం మా జీవం
నీకోసం నీకోసం

—o—

## 9

రుద్రభూపాల నాయకి తెలవారె
ఉదయించాడు భానుడు తెలవారె
నిదురించే ఓ హిమబాల
నటభైరవి మేల్కొనవమ్మ:

బలహంసకూసె శహనాయి మ్రోగె
కల్యాణి మేల్కొనవమ్మా తెలవారె
దేవక్రియలన్ని తీర్పగ భవరాణి:

కమలాలుపూచె దర్బారు వేచె
ఓ శూలిని మేల్కొనవమ్మా తెలవారె
సారమతి నిద్రమానవె తెలవారె
జలకాలు తోడి రమ్మనుచు వేణి
నీ కోసం నిలిచిందమ్మ కృష్ణమ్మ
చారుకేశి నివాళిని చేకొనుమా.

—o—

జయ జయ నమోగౌరి రాజేశ్వరీ శాంకరీ భక్తసంవాసినీ ముక్తిసంధాయినీ విశ్వకర్తల్ మునుల్ దేవతల్ నిన్ను కీర్తించలేరన్న నేనెంతవాడన్ క్షమాంభోనిధీ సర్వలోకాలు పాలించు మాతల్లి శ్రీ కాళికా నీవు లేవంచు భావించి భాషించు దుర్మార్గులన్ మార్చి సన్మార్గులన్‌చేయు దేవీ జగాలేలుతల్లీ సదా నిన్ను సేవింతు పూజింతు దీవించవమ్మా ! ఇలన్ సర్వదైవాలు నీవేకదే అంజలుల్. శుభ్ర వస్త్రాన్వితామూర్తి రాజేశ్వరీదేవి లోకేశ్వరీ.

భవ్యగంగా తరంగాలు పాదల సేవించు కాశీవిశాలాక్షి నీవేకదే దివ్యతేజాలు వెల్గించు శ్రీ కంచిలో మించి భాసించు కామాక్షి నీవేకదే, కృష్ణవేణీ తరంగాల సంగీత మాధుర్యమున్ గ్రోలు మా యమ్మ దుర్గమ్మ నీవేకదే ; అందచందాల కుందాలు అర్పించి నీ భక్తబృందాలు సేవింప శ్రీశైలవాసమ్ము గావించు శ్రీ భ్రామరీదేవి నీవేకదే. విశ్వమాతా నమస్తే ! నమస్తే ! నమః !

—— o ——

## 11

ఇంపుసొంపు లొలుకుచున్న
సంగీతానివే : దేవీ
సంగీతానివే
ఏడుమెట్ల మేడమీద
ఆడుచుంటివా ? దేవి
పాడుచుంటివా ?

పల్లవి నీవేనమ్మా : అను
పల్లవి నీవేనమ్మా :
రాగం నీవే
భావం నీవే
రాగం నీవే భావం నీవే
సాగుము బంగరు తీవెలా

తాళం నీవేనమ్మా : ఈ
గానం నీవేనమ్మా :
తాళం నీవే
ప్రాణం నీవే
తాళంనీవే ప్రాణంనీవే
సాగవే గాణీ సాగవే
సంగీతానివి నీవు : ఉ
ప్పొంగే లయవే నీవు
పొంగేలయవే
బంగరు వలయ
సాగవె యమునా సాగవే

—o—

హిమశైలకుమారీ ! ఇవిగో
మా సేవలు గైకొనుమా !
నీ పదములు కడుగగ దేవి
మా కన్నుల నీళులు గలవు
నీ సన్నిధిలో నిలుచుంటే
గుండెలు చల్లగమారును మా
గుండెల వెన్నెల జారును
కలిగేను జ్ఞానం

నీ దీవెన లొాసగుము తల్లీ
మా పాలిటి గుణగణావల్లీ
నీ నామం తలచితిమంటే
పాపం దవ్వుగ పోవును మా
పాపం దూరము చేరును
కలిగేను జ్ఞానం

అమ్మంటే కమ్మనిమాట
అదియే మా ముక్తికిమాట
ఆ బాటను వడిచితిమంటే
కష్టాలన్ని తీరును నీ
లోకం చూడగ వత్తుము
అది మాకు చాలు

—o—

జననీ గొనుమా
మనవిదె వినుమా,
లోకాలేలే దివ్యమాతా:

మామాటలోన హృదయములోన
నిలువగదేని రయమున రావే
మరిమరి విన్నకోరితి
నీరూపే మాకు
దారినిజూపే దివ్యజ్యోతి

గుండెలలోన గుడికట్టితిని
వెలయగ దేవీ: పరుగునరావే
మది నినుచూడవేడెను
నీ మాటే మాకు
ము_క్తిని చూపే పూలబాట

మా మానసంలో వెలసెను కోవెల
దర్శించరావే నడయాడరావే,
మరి మరి చూచివేచితి
నీరాకే మాకు
భక్తిని తెలిపే ప్రేమకోట

—— ——

# 14

శాంకరి : భక్తవశంకరి : శూలిని
ఈశ మనోహరి పార్వతి
పంతువరాళి పంతమిదేల
చెంతకు చేరవా ?

మోహనరూపా: జయమనోహరీ
స్త్రీజన తిలకా మోదమడగ
నే నాందోళించిన నాటమండి
నీరూపమ్మ పురూపమ్మయె
ఇమ్మావరాళి శ్రీకాళికా !

గుండెలలో నీ రూపమున్నది
నిండుగవెలిగే దీపంఉంది
పూజ సేతునమ్మా రమ్మా
రాజమౌళితో పాటుగా

రగిలించితి కర్పూరపుకళిక
హారతిదే గైకొనుము కాళికా
జాగు సేయకమ్మా రమ్మా:
రాజశేఖరుని తోడుగా.

—o—

నీ దివ్యఛ్ఛాయలో
నిలుచుంటి కోర్కెతో
నీ కర కిరణావళితో మము
దీవించు భైరవీ! ఆనందభైరవీ!

శుభవీర! వసంతవేళ
ఆందోళి పైన
ఊరేగి రమ్మా!
స్వాగతములు పలుకును జగము
బంగారు వీణగా
పొంగేను రాణగా

కోకిల ధ్వని రేగెను వనిలో
నీకెదురు నిలిచి
నీ రాక దలచి
నీ కర కిరణావళితో మము
దీవించు భైరవీ! ఆనంద భైరవీ!

—o—

# 16

ఆందోళపైన సాగింది గాణి
హిందోళగతుల మోగింది వీణ
సాగింది గాణి
మోగింది వీణ

సంగీత ఝరుల తేలింది అమ్మ !
బంగారు విరుల వాలింది అమ్మ !
తేలింది అమ్మ:
వాలింది అమ్మ !

కదిలింది వీర వాసంతవేళ
తరులన్ని సురటి వీచేటి వేళ
వాసంతవేళ
వీచేటి వేళ

సారంగరాగ శ్రుతి రంజనాలు
చెవిపైకిమూగ ఆనందమీగ
సారంగరాగ
మానందమీగ

నీలాంబరాలు ఛత్రమ్ము వోలె
తనపైని నిలువ తనకొలువు జేయ
ఛత్రమ్ము వోలె
తనపైని నిలువ.

—o—

## 17

నీ కొరకు వేచి
విలపించె వీణ
తన గొంతు వాయు
లీనమ్ము నొందె
విలపించు వీణ
వినిపించ లేద

ఎన్నోయుగాల
సన్నాయి మ్రోగె
పున్నాగ రాగ
సన్నాయి మ్రోగె
సన్నాయి మ్రోగ
విన్నావ లేద

మద్దెల అరుపులు వినపడలేదా ?
ఒద్దకు చేరగ పరుగిడరాదా !
మద్దెల అరుపుల
వద్దకు రావా ?

పలుకు మృదంగము జనని ఏదనుచు
తెరువులు వెదకును నీకై
హృదయ విహంగము జనని ఏడనుచు
పరుగిడి వచ్చును నీకై

— ० —

# 18

కనలేవా ? వినలేవా ?
తనయుల మాటల
భ్రమరమ్మా :

యమునాదేవి : జయమనోహరి
ఆభోగీ మముకనలేవా ?
నీవురానిచో మాముఖాలలో
ముఖారి నిలుచును రావమ్మా :

చారుకేశి ఇటు పంతములైతే
నాదనామ క్రియలే సొంతములా
శ్రీరంజని ఇటు నీవురానిచో
మాగళమ్ములో శివరంజనులే

కామవర్ధినీ కనపడరాదా
వేగవాహినీ కనపడలేదా
సారమతీ మముకానగలేవా ?
కానడరాగములే మాపాలా ?

— o —

## 19

మనసు నిదుర పోతున్నది
మేలుకొనుము విశ్వశిల్పి అమ్మా !
ఇది సమయం ఇది సమయం
శిలగా మారిన మనసుకు నీ
ఉలి తాకించవమ్మ! శిల
లను పలికించవమ్మ :

జగతి నిదుర పోతున్నది
మేలుకొనుము విశ్వశిల్పి అమ్మా !
ఇది తరుణం ఇది తరుణం
జడమై పోయిన జగతికి నీ
కెడమైపోయిన జగతికి నవ
జీవము పోయవమ్మ !

మంచి నిదుర పోతున్నది
మేలుకొనుము విశ్వశిల్పి అమ్మా !
ఇది కాలం ఇది కాలం
మోడై పోయిన మంచిని ఇటు
పాడై పోయిన మంచిని చిగు
రింపగ జేయవమ్మ :

—o—

## 20

ఎల్ల వేళల గుండెలో దివ్యమై
నిండి వెలిగేటి జ్యోతి
అంజలిదె అందుకొనుమా?
మా యమ్మ: పుష్పాంజలిదె అందుకొనుమా:

మా ఎదల ప్రమిదయందు ఓ దేవి
వెలిగింప భక్తిజ్యోతి
నీ స్నేహ మవసరమ్ము: వెలుగగా
నీ ప్రేమ అవసరమ్ము:
మా కళ్ల ఆలయములో ఓదేవి
నియిపుకొందుము ప్రేమతో
రమ్మురమ్మన దేవతా! వైళమే
ఇంపు నింపుము కాళికా :

మా కంట నీరునింపి మాయమ్మ
పాదాలు కడుగనిమ్మా :
మా బాధ తీరునమ్మా : నీ గాధ
వినినచో లోక మాతా!

—o—

## 21

ఇది కలికాలం కలికాలం
ఇది ఆ కలికాలం

ఎక్కడ జూచిన ఏదో ఆకలి
ఎప్పుడు పుట్టుచునుండు
తీర్చవమ్మ ఆకలిబాధ
మార్చవమ్మ ఈ కలిగాథ

ఆకలిదీరక శోకంగలుగు
లోకంలో నిరుపేదలకు
అడిగిన పెట్టేతల్లివి నీవని
అడిగినాము కరుణించవే
అడిగినాము శరణీయవే

పేదల బాధల రోదనలన్ని
నీ చెవి పడునో లేదో
తీర్చవమ్మ పేదలయిష్టం
మార్చవమ్మ భక్తుల కష్టం

కలికాలం కలికానికైనను
మంచిని పంచగ లేదు
మంచి పెంచి మమతను పెంచు
అమ్మప్రేమ సరియనిపించు

—o—

# 22

శార్దూల వాహనా ; శరణంటి మాతా
రావమ్మ నీపూజ చేసేము జననీ ;

మల్లెలు మొల్లలు చంపకమాలలు
ఉత్పలమాలలు అల్లితి నీకోసం
సీసాలలో తేనె నింపాము నీకోసం
జాగేల మా యమ్మ రావమ్మ అమ్మా ;

విరిపూవుల హారం నీజడ కందం
నీ నవ్వుల తోరణం మా మనసుల బంధం
ఎద చినిగివచ్చింది ఈ తేటగీతం
గళ మాలపించింది నీపై సంగీతం

మత్తేభరాజుపై అంబారీ కట్టాము
అధివసియించవే అందాలదేవీ ;
ఓ ఆటవెలది ఆడవచ్చెను నీకోసం
చలమింక మానమ్మ రావమ్మ అమ్మా ;

—o—

## 23

బంగారు కొండవె
ముత్యాల దండవె
సదా ఇటే
సాగిరా వేగిరం
వెలుగులోయన మా నుతి
ప్రేమగా విన

గుండెలలోన తెలియని ఇరులు
నిండుగా నిండెను భూతమోయన
నిండుకొని గుండెలను పిండుకొనియెను
జిలిబిలి జాబిలివోయన వెలుగు జల్లుము
గుండెల కడిగివేయుము

గుండెలలోన నిండెను బాధ
నిండుగా నిండెను అగాధమోయన
నిండుకొనగ గుండెలెదో మండుకొనియెను
పలుకుల విరితేనియలన చిలకరింపుము
గుండెల పలకరింపుము

గుండెలలోన పారె చిలుగులు
పొంగెను ఉప్పొంగెను పెనువాగులోయన
పొంగి పొంగి పొంగి పొంగి పొరలసాగెను
దయలకు జలనిధివోయన కలుపుకున్నచో
బాధల నిలుపు కొందును.

—o—

## 24

ఓ దేవీ శివ నటభైరవీ !
నీ వరకథ మురిపించినదివో
పుణ్యవతీ !
వెలుగైన నీ గాధ
తొలగించు మా బాధ
జగదీశ్వరీ రాజ
రాజేశ్వరీదేవి

చిలికించు నీ నవ్వో
వెలిగించు మణిదివ్వో
నటభైరవీ వీర
నిటలాక్ష దేవేరి

నీయందె సడివిన్న
మా డెందములు మిన్న
అందాలదేవి ఆ
నందాల పూదీవి.

—o—

# 25

ఓదేవీ : ఇదే వందనం
విశ్వమాతా ఇదే వందనం
మొర లాలింపవా
పరి పాలింపవా
దివ్యగానాలు వినిపింపవా ?

విశ్వవీణియను పలికించుమా
భక్తిరాగాల నొలికించుమా
వీణ పలికింపుమా
పేర్మిమ చిలికింపుమా

నీవు గళమెత్తితే చాలును
జగతి అణువణువు పులకించును
వీణ పలికించితే
జగతి పులకించును

అమ్మ ఈ విశ్వమే వేదిక
విమల మృదు గాయనీ నీవచే
వీణ సవరించుమా
ప్రేమ వివరించుమా
దివ్యగానాలు వినిపింపుమా !

—o—

# 26

అమ్మ ఏమిచేయును
ఆమె ఏమి కోరును
ఎట్లుచూచి ఏమి పలుకుచుండును ?
ఉన్నవారి చేయిచాచి
ఇచ్చుమనుచు అడుగును
లేనివారి కడుపుచూచి
అడిగి తిండిపెట్టును
అమ్మిట్లు చేయును
ఇటులే చేయును
కలిమిలేమి కలిపిపట్టి
చెలిమి పంచిపెట్టును
మంచివారి మనసుచూచి
వారి మేలుకోరును
చెడ్డవారినైన చేరి
వారి సుఖము కోరును
అమ్మిట్లు కోరును
ఇదియే కోరును
మంచి చెడుల రెంటికలిపి
ప్రేమ నుడుల తెలుపును
మిట్టమీద నిలచి అమ్మ
పల్లములో చూచును
నేలమీద నిలచి అమ్మ
ఏకమనుచు పలుకును.
అమ్మిట్లు చేయును ఇదియేకోరును
మిట్టపల్లముల రెంటిని
ఒకటి చూపించును.

—o—

## 27

జాలియే లేదా ?
జాలము లేల
కాళి పరాకా ?
పిలుపు వినలేదా ?

గుండెలు పగిలే
అరుపులు వినినా
దండిగ కూ్పాచన
మనసేల కలిగె
పరుగిడి రావా
వరమీయ లేవా
ఏలుకో కాళీ !

కన్నుల నీరు
ఏరుగ పారె
కనపడలేదా ?
కనపడరావా ?
కరుగద మనసు
కరుగును తెలుసు
కదలిరా కాళీ !

——o——

# 28

ఎవరమ్మా : ఎవరమ్మా ,
ఈ అమ్మ ఎవరమ్మా :

నవ్వులోనె పాలవెల్లి తోచు
నవ్వుతోనె మా మనసులదోచు

చూపులోనె చూపు మాకు ప్రాపు
చూపుతోనె మమతలెన్నొ రేపు

మాటలోనె నేర్పు మంచి బాట
మాటతోనె నిలుపు మంచిచోట.

—०—

# 29

సన్నాయి నౌతాను నీ వూదవమ్మ ;
వేదాల నాదాలు నిండింపవమ్మ :
నే వీణ నవుతాను నువు మీటవమ్మ ;
అనురాగ రాగాలు పలికించవమ్మ ;
నే వేణు నవుతాను మోగించవమ్మ ;
నీ దివ్యభావాలు పూరించవమ్మ ;
నే పాటనవుతాను నువు పాడవమ్మ ;
నాలోన లీనమై నను వీడకమ్మ ;

—o—

# 30

ప్రేమగల కన్నతల్లి
పుట్టితివి మేలుకై కల్పవల్లీ
ప్రేమలకు పాలవెల్లి
శ్రీశైలపురము నేలేటి తల్లీ

వెలసితివి శైలబాల
శ్రీశైలపురములో అమ్మవోలె
మెడలోన మల్లెమాల
వేసెదను నిదురబో సుగుణజాల

జాగేల మందగమనా
కనులెత్తి చూచు రాకేందు వదనా
నిదురబోవమ్మ యమున
రాదేల నిదుర రజతాద్రి సదనా

పెద్దగా ధనములేదు
మడిమాన్య మీయ నాచేతగాదు
నీ సేవ జేసికొందు
పూజకై పుష్పాల నిచ్చుకొందు

—o—

అతుకులోనె బ్రితుకుంది
బ్రతుకులోనె అతుకుంది
అతుకులేనిదే బ్రతుకులేదు
నిజము ఈమాట
మెతుకుకోసం బ్రితుకువేషం
అమ్మదీమాట
ముక్తికోసం రామనామం
జరుపుకోవాలి
అందుకోసం శక్తికొరకై
భుక్తి కావాలి
భుక్తి గడిచేటందుకోసం
డబ్బుకావాలి
డబ్బులంటె లక్ష్మియనుచు
మనకు తెలియాలి
రామరామ యనుటకోసం
పలుకు కావాలి
పలుకులంటె వాణియనుచు
మనకు తెలియాలి
అత్తకోడలు కలిసివస్తే
రక్తి కడుతుంది

## 32

రామనామం పలికితే సరి

ముక్తి వస్తుంది

బ్రతుకు సఫలమ్మందుకోసం

ముక్తి కావాలి.

ముక్తికోరి భక్తిమార్గం

మనము త్రొక్కాలి

కమ్మనైన అమ్మమాటలు

మనము నమ్మాలి

నమ్మి నెమ్మిన అమ్మ బాటన

మనము నడవాలి.

—o—

## 33

కన్నుల ముందర ఉన్నది జగము
మెదిలే జగము చెరిసగము
ప్రకృతి నీవై పురుషుడు శివుడై
నిండి యున్నట్టిదీ జగము
ఒక పరివేషే నీ వేషానికి
లేని జగమ్మని గుర్తమ్మా: అది
మాయ జగానికి గుర్తమ్మా:
ఒక పరివేషే నీ వేషానికి
ఉన్న జగమ్మని గుర్తమ్మా అది
కన్న జగమ్మని గుర్తమ్మా
ఉన్నది లేదను సందేహమ్ములు
మా హృదయమ్మున లేవమ్మా అవి
నీ సన్నిధిలో వద్దమ్మా:
మౌనమె ముక్తికి మూలమ్మనెడి
విషయము తెలియుట మాపంతు అని
వివరించుటయే నీవంతు
ఉన్నది నీవేలేవమ్మా:
లేనిది నీవేలేవమ్మా:
ఉన్నది లేనిది నీవేలే
అన్నీ నీవే లేవమ్మా:

—o—

## 34

రావమ్మ ఈశ్వరి
రాజ రాజేశ్వరి
మా యింటిలోపల
గలగల ప్రవహించు
కృష్ణమ్మ పాదాలు పేపించి
తరియించు.

మాతోటలో పూచు
నీలాంటి కుసుమాలు
నీపాద పద్మాల
చేరి భజియించేను.

పాతాళ గంగమ్మ
స్నానాలు చేయించు
నీ తావులో దివ్య
భ్రమరాలు పాడేను.

——o——

## 35

జయజయ పార్వతి
జయజయ పార్వతి
జయజయ హైమవతీ
శూలధరీ : పాపహారీ : ప్రేమమయురీ

మా యిలవేలుపు నీవెకదా :
ఈ యిలదేవత నీవెకదా :
మా మొరవినవా ; మము దయగనవా :
జయమీవే జననీ
శైలసుతా : హేమలతా ; జయమాతా
మంజుల భాషిణి నీవెకదే
మంగళరూపిణి నీవెకదే
నీ ఒడిలో మము చేరగదీసే
భాగ్యము నీయగదే
శూలధరీ : పాపహారీ ; ప్రేమమయురీ

ఏదరి దొరకని దీనులము
నీదరి జేరిన హీనులము
సుమధురభాషిణి సుందరరూపిణి
జయమీవే లలితా ;
శైలసుతా ; హేమలతా ; జయమాతా ;

—o—

# 36

జాగేల హిమబాల
జాలము లేల
రావేల సుమబాల
పరిమళ లీల.

మమ్ముఁజూచి మరుడెందుకు
పరుగులెత్తును
మా మదిలో నీ నామం
తలచినందుకు
నీ మదిలో మదనాంతకు
డున్న యందుకు
నిన్ను తలప మదనాగ్నులు
ఆరునెందుకు
మా మదిలో నీ నామం
తలచినందుకు
నీ మది గంగాధరుడు
నిలిచినందుకు
నిన్ను తలప కామజలధి
ఇంకు నెందుకు
మా మదిలో నీ రూపం
వెలసి నందుకు
నీ మదిలో నిటలాక్షుడు
నిలిచినందుకు ?

— o —

# 37

శ్రీవృత్తములో పేరంటం
అమ్మను కొలిచే అమ్మను తలచే
పేరంటం ఇది పేరంటం
శ్రీ పెంపుల సుకాంతులొలికే
స్త్రీలంతా అమ్మను కొలిచే

అమ్మ ముఖాంబుజ బింబములోన
చిత్ర విచిత్రపు కళలనుగాంచే

విశ్వదేవి వినయాన్వితను మాతను
మంజుభాషిణులు తలచే కొలిచే

కుసుమిత లతావేల్లిత, లతాంగి లలితకు
మానినీమణులు సేవలుజేసే

—o—

# 38

పసిపాపల చూచినా
చిగురాకుల చూచినా
పువ్వురేకుల చూచినా

నీజ్ఞాపకమే వచ్చును
నీరూపమ్మే తోచును

చెట్టుల ఏరుల చూచినా
పిట్టల బారులు చూచినా
పచ్చని పైరులు చూచినా

నీ రూపం తలంతును
నీ నామం స్మరింతును

మండే మంటను చూచినా
పండే పంటను చూచినా
వండే వంటను చూచినా

నీ రూపం తలంతును
నీ నామం భజింతును.

—o—

నీ అక్షర దీపమ్ముల
వెలుగు పుంతలో నడతును
నీ నోటివెంట రాలిన
ముత్యాలరాశి నేరుకొందు
నీ సన్నిధిలో నిలుచుని
నీ కాంతులు సోకినచో
గడ్డిపరకనైన నేను
తీపిచెఱకునై పోదును
నీ పద పద్మమ్ములోని
మేలి దళమునై పోయెద
పరివశించి పోయెదనే
పరిమళాలు చల్లెద
విపినంలో పుట్టిన ఒక
వెదురుగడను నేనమ్మా
కాల్చి రంధ్రములనువేసి
పాట పాడవమ్మా ।

—o—

# 40

వస్తావా సోదరీ !
వస్తావా సోదరా !
శ్రీగిరియందున
వెలసిన అమ్మను
చేరగ చూడగ

భ్రమరాంబాదేవి ఇంట
ఆనందము వెలుగునంట
ఆనందపు దివ్వెలలో
అమ్మవారి నవ్వులలో
అంతులేని అర్థమంట
భ్రమరాంబాదేవి ఇంట
వైకల్యము లేనిదైన
కైవల్యము ఉన్నదంట
వర్గరహితమైనదైన
స్వర్గలోక మున్నదంట
వేదశాస్త్ర పురాణాల
ఇతిహాస కావ్య ప్రబంధాల
విలసిల్లిన దేవి ఇంట
ఎక్కువతక్కువల లెక్కల
చిక్కులేవి ఉండవంట

—o—

ఎవరికోస మెవరికోసము
ఈ పూల దోసిళ్లు
ఈ పూల పందిళ్లు
ఈ పూలలోగిళ్లు
ఈ పూల వాకిళ్లు

శ్రీశైలములో వెలసిన
అమ్మకోసమే మన
అమ్మకోసమే.

తెల్లని మల్లెలు కొల్లలు కొల్లలు
ఎవరికోసము ?
చల్లనైన తల్లి
భ్రమరమ్మ కోసము.

వన్నెల చిన్నెల సన్నజాజి పూవులు
ఎవరి కోసము
మిన్నయైన కన్నతల్లి
అమ్మకోసము.

శ్రీ సమేత పారిజాత
మెవరికోసము
భవ్య చరిత దివ్య చరిత
అమ్మకోసము మన
అమ్మకోసము.

## 42

వింత వింత రంగుల - ఈ
బంతు లెవరి కోసము - చా
మంతు లెవరి కోసము
పెద్ద యింతి గొనవు దొంతి
అమ్మకోసము మన
అమ్మ కోసము
పొంగిపూచు సంపెంగలు
ఎవరికోసము
అనంగవైరి మనోజ్ఞ భృంగి
అమ్మకోసము మన
అమ్మ కోసము

అందమైన మందారం
ఎవరికోసము ?
అందరాని అమ్మ పాద
పూజ కోసము ?

ఇన్ని పూలదోసిళ్లు
ఎవరి కోసము
అందమైన అమ్మ పాద
పూజ కోసము.

—o—

## 43

మంగళమిదె మంగళమిదె
మంగళ మిదియే
శ్రీగిరి భ్రమరాంబా జయ
మంగళ మిదియే శుభ
మంగళ మిదియే

మునిజనగణ సేవితా
జయమంగళ దేవతా
కొను మంగళ మాలికా
మిను మంగళ గీతికా

మందగమన రాజవదన
కుందరదన భక్తసదన
మంగళమను మంగళమను
మంగళహారతు లివెగొను

శైలబాల సుగుణజాల
శివలోల భక్తపాల
మంగళమను మంగళమను
మంగళహారతి యిదెగొను

—o—

అమ్మాలాలి : బంగరు
బొమ్మాలాలి
కమ్మని తావులు జిమ్మే
పువ్వుల కొమ్మా: లాలి :
విజయపురమ్మున
విజయము చేసిన విజయాలాలి
నీ మెడలో విరి
దండలు వేసెదనమ్మాలాలి.
అమ్మల గన్న
అమ్మవు నీవేనమ్మాలాలి
ముగ్గురమ్మల
మూలపుటమ్మ వమ్మలాలి.
పుత్తడి బొమ్మ
పువ్వులరెమ్మ నిదురబోవమ్మా
కన్నులెత్తి యిటు
కననేలమ్మ కనకదుర్గమ్మ.
జోలలు పాడుచు
జోకొట్టేము నిదురపోవమ్మా
లోకా లేలే
చల్లని తల్లీ నిదురపోవమ్మా !

